# ఆరాధన విధి వి. మర్శ

## ఖండి. మర్దనము

13[illegible]9
10,129

వేదాంతగ్రంథములు

# ఆరాధనవిధి విమ

శైవమతాభిమానులారా !

శైవధర్మముల నిర్మూలించుటకై యవతరించిన బ్ర॥ శ్రీ॥ వీ॥ పా॥ యాజిగారి మహాత్మ్యము మీ రెఱింగి నదే కదా ?

ఇప్పు డారాధనవిధి విమర్శనమునకుం గడంగిరి. ఈ సత్సంకల్పమును మొదటఁ దొలిపత్త్రికలోననే తెలిపియుండిరి కావునఁ గొనకు శైవమత విధ్వంసనంబునకుం దలపడుట యెంతయు వింతగాదు. వారీ మహాకార్యంబు దలపెట్టుటకుఁ బ్రయోజనంబు లనేకంబులు చూపట్టెడిని.

సృష్టి మొదలుకొని యేనాఁడు నెచ్చోట నెవంఁడును నాచరించి యెఱుంగని స్వమతవిధ్వంసనంబునం జేసి జన్మసాఫల్యంబు నొందఁగలుగుట మొదటిది. శైవ మతద్వేషులగు విమతుల నాశ్రయించి పొట్ట పోసికొనఁగాంచుట రెండవది. "యేన కేనా ప్యుపాయేన ప్రసిద్ధః పురుషో భవ" అనునీతి ననుసరించి ప్రసిద్ధులగు పండితులతోఁ గలహాలాభంబునం జేసి ప్రసిద్ధిఁబడయఁగల్గుట మూఁడవది. భక్తిజ్ఞానాదులం గురించి యేమియు వ్రాయనేరమింజేసి యేరితోనైనఁ గలహంబుఁ గలుగఁజేసికొని విషయలాభంబునం బత్త్రికను నింపికొనఁగాంచుట నాల్గవది. లోకంబున నెటఁ జూచినను గలహశతంబుల వెలయింపఁజేసి తనదు యుగపురుష ప్రథమావతార ప్రయోజనంబును నెరవేర్చుకొనుట యేనవది. ఇట్టి లనేకంబులు గల్గియుంటనే విసువక జడియక తడయక కసుంగసుఁ బట్టుదలతో నుద్యమించుట.

ఏమిది ? మతధర్మంబులయెడ సంశయంబు గలుగ నది నివారించుకొనుటకై యడిగిన మాత్రమున సమాధానము చెప్పఁజాలక దూషించెనని దోషారోపణము చేసెదవేలం దురా ?

ఈ జగమున మతము లెన్నిలేవు ? మతస్థులెందఱు లేరు ? మతధర్మవిషయకసంశయగ్రస్తులు నెందఱులేరు ? ఎందేని రిజస్టర్డు లేఖలతోడను బహిరంగ లేఖలతోడను సందియములఁ దీర్చికొనువారిం గంటిరా ? మఱియు శైవధర్మములు కలిధర్మములనియు, మహాదోషములనియు, మహాపాతకములనియు, వ్రాయసాహసించుట విపరీతభావమున నెగాక సంశయభావమున నెన్నఁడేని సంభవించునా ? ఏమతస్థుఁడైన నెన్నఁడైన నీవిధమున సంశయముల వారించుకొన సమకట్టియుండెనా ? యోజింపుఁడు.

సకలమతములును నిర్దుష్టములు శైవమతమె మహాదుష్టము గాన నిజమిట్లు వెల్లడించుచున్నాఁడు దీనందప్పేమందురా ?

ఇంతటి బుద్ధిమంతుఁ డేమతమందును నవతరించియుండలేదు. ఇట్టి మహానుభావునిఁ బడయఁ గలుగునంతటి మహాభాగ్య మీశైవమతమునకె గాక తక్కు మతములకెక్కడిది ? దాననేకావలయు సకలమతములలో నీమతము కులదీపకుఁడగు కొడుకుంగన్న కతంబునంబాడను మహాప్రతిష్ఠకు భాజనం బయ్యెను.

శైవమత మాఱుమతములలో నగ్రగణ్యమై సకల మతములకంటెఁ బ్రాచీనమైనదని చరిత్రకారు లందఱచేఁ బొగడ్త నొందఁగలిగెను గాని యీ మహాపండితుని పాండిత్యము

ముందఱ యీయవతారపురుషుని ధర్మసంస్థాపనము ముందఱ ఈ మహావిమర్శకుని విమర్శముందఱ నెందునకును గొఱగా దయ్యెను.

భూమిపై నీమతముత్పన్నమైనది మొదలుకొని స్వమతమునఁ గాని విమతమునఁగాని యెందఱు పండితులు జన్మించియుండలేదు? ఇట్టి నిరూపణము నెందైనఁ గంటిరా? మతోద్ధారకులగు నేయాచార్యపురుషులైనను బాండిత్యలోపమునఁగాని. వంచకతా స్వభావమునఁ గాని మత ధర్మములఁ బరిత్యజించి యుండిరని యెంతటి బుద్ధిమంతుఁడును వచింప సాహసింపఁడు. లోకమునఁగొందఱు ,విమతపూర్వాచార్యుల పండితులనియు, వంచకులనియు నెంచినను స్వమతపూర్వాచార్యులట్టివారని కలలోనైన విశ్వసింపరు.

మహాపురుషోద్ధారితములై యనాదిసిద్ధములగు మతములు విభక్తిజ్ఞానమైన లేని యవ్యుత్పన్నప్రాతిపదికములచేఁ జేయంబడు విమర్శంబులచేఁ బరామర్శింపఁబడునవి కావు?

ఈతని పాండిత్యాతిశయము. యోగ్యతావిశేషము, ధర్మసంస్థాపన పరత్వము పండితమండలీ మూకీకరణపరిభావము, దిగ్విజయ కోలాహలము మున్నగు గుణనిధానముం గూర్చి పాకనాటి యన్నాథ చరితమను గ్రంథాంతరము రచింపఁబడియుండు కతన నిట నది నిరూపింప ననవసరము.

ఆరాధనవిధివిమర్శముం బట్టియె తనదు సత్యవ్రతము, బుద్ధికౌశలముమున్నగునవి తెల్లమయ్యెడిని. మూముఁడు,

· శ్రీనాగలింగ శాస్త్రులవారిచే రచింపఁబడిన యారాధనవిధిని విమర్శించుచున్నామని యారంభించెను గదా? ఆరాధనవిధి (శ్రీశాస్త్రులవారిచే రచింపఁబడినట్టులా) గ్రంథమునఁ

గలదా ? ఆంధ్రప్రయోగము మాత్రము శ్రీశాస్త్రిల వారిచే వ్రాయఁబడినట్టులా గ్రంథమున నున్నది. శ్రీశాస్త్రిలవారిచేతనే ఈగ్రంథము కొలఁదికాలమునాడు రచింపఁబడి యుండునెడ నింతకుఁ బూర్వము శైవులందఱు నేవిధానముచే నాబ్దికము జరుపుకొనుచుండిరి ? దీనిచేతనేగదా జరుపుకొనుచున్నవారు. అట్లుగాక తానవలంబించిన శ్రాద్ధవిధానముతో నెన్నఁడైన జరుపుకొనిరా ? ఈ యారాధనవిధి యెన్నఁడులేనిది క్రొత్తగ శ్రీశాస్త్రిలవారే తెచ్చిపెట్టిరేని లోకులందఱు దానినెట్లవలంబింతురు ? కావున నీమతముత్పన్నమైననాటినుండి యవిచ్ఛన్నముగ నాచరణమున నున్నదానినే సభవారి కోరికపై నాంధ్రప్రయోగముతో వ్రాసియిచ్చియుండిరి.

ఇట్టి యారాధనవిధిని దూషింపనెంచి దానంజేసి సంఘమున కాగ్రహము కలుగునేమోయని తలంచి శ్రీశాస్త్రిలవారిచే రచింపఁబడినదని వ్రాయునెడ నీదూషణమంతయు శ్రీశాస్త్రిలవారిదేగాని మనదేమున్నదని లోకులు భ్రమించుటకై యీకపట వృత్తి నవలంబించెను. ఈ యారాధనవిధి పూర్వమునుండి యున్నదియో ? క్రొత్తగ శ్రీశాస్త్రిల వారిచే రచింపఁబడినదో ? ఈ సంఘమువారికిఁ దెలియదా ? మహాసభవారికిఁ దెలియదా ? తన హృదయమునకుఁ దెలియదా?

జగమెల్ల నెఱింగియున్న యీయంశముననే యింత యసత్యవ్రాతకుఁ బాల్పడిన మహానుభావుం డెంతకుఁ జాలఁడు. తన పత్త్రికయందుఁ గొనకు 'సత్యమేవజయతే నానృతం' అని ఘోరప్రమాణములను జేయుచుంట దేనికో గ్రహించితిరా ? తాను కలియుగ సత్య హరిశ్చంద్రుఁడని యెల్లరు విశ్వసించుటకే. మఱియుఁ బత్త్రికయందుఁ దాను

వ్రాయునబద్ధపుఁవ్రాతలన్నియు నిజమని లోకులు భ్రమిం చుటకు ననుటనిక్కము. అట్లుగాక తా నిహపరంబులకు వెలి పుగలవాఁడే యగునేని తనవ్రాత సత్యమేయని ధ్రువపఱచు కొనునందాక విమర్శాంతరము వ్రాయనే వ్రాయఁడు. దీనిం బట్టి యాతని సత్యహరిశ్చంద్రత్వము ధ్రువపఱుచుకొనుఁడు.

పత్త్రికాధిపతిగారి నేకవచనముతో గ్రహించుట యుక్తము కాదని ప్రశ్నింతురా ? తన్నొరులు బహువచన ముతో నెల్లను గౌరవింపరని తనకుం దానే బహువచనప్ర యోగము చేసికొనుచుండుటం జేసి తన్నొరులు చేయననవస రము. అదిగాక తామేకవచనముతోఁ జెప్పికొనువారికి నొరులు బహువచనముతోఁ జెప్పుటవిధియైనట్లు తన్ను బహువచన ముతోఁ జెప్పికొనువాని నేకవచనముతో గ్రహించుట యవి ధిగాఁదోపదు. ఈతనిబుద్ధికౌశలమిప్పటివారి గ్రంథముల విమ ర్శించుటకుఁ జాలియున్నదని తేలునెడఁ బదంపడి ప్రాచీన సిద్ధాంతముల విమర్శించుట కర్హత కలిగినది లేనిది యాలో చింపనగును. ఆరాధనవిధి ప్రాచీనమైనను దీని యుపోద్ఘా తము మాత్రము శ్రీ శాస్త్రులవారిచే వ్రాయఁబడినదే. దీనిపై వీరు గనుపఱచిన విచారముం గాంచుడు.

ఇఁక శాస్త్రిగారి యుపోద్ఘాతమునించుక విమర్శించుకొందము.

ఆబ్దికము కృతజ్ఞతను వ్యక్తీకరించు కర్మయా !

శాస్త్రిగారు మృతులైన తలిదండ్రులనుగూర్చి చేయు ప్రత్యాబ్దికము యొక్క ప్రయోజనముం గూర్చి యుపోద్ఘా తమునందిట్లు ముచ్చటించియున్నారు. అదేమన, సకలశుభ గుణములలోఁ గృతజ్ఞత మిగులనుత్తమమని యెల్లరకుఁ దెలిసి నవిషయమే. మనకు మేలుచేసిన వారిలోఁ దలిదండ్రులకన్న

నుత్తముఁలొరులుండరనుటయు సుప్రసిద్ధమే. అట్టి తలిదండ్రుల యందు మనకుఁగల కృతజ్ఞతను వ్యక్తీకరించుటకు వారి నుద్దేశించి యేటేట జరుపఁబడు నాబ్దికమునకంటె వేఱొకటి కనఁబడుటలేదు.' అనివ్రాసియున్నారు. శివశివా! యిదెక్కడిపాపపు బోధ. ఇది ఆర్యసామాజిక సిద్ధాంతమున కించుక మెఱుఁగు పెట్టుచున్నది. అట్లు చేయవలసినదని వేదశాస్త్రములు చెప్పినవా? ప్రత్యాబ్దికముఁవలనఁ బితలకుఁ బరమపదమును దమకు గోత్రవృద్ధియునను రెండు ఫలములను గోరి చేయవలయునని శ్రుతులిట్లు చెప్పియున్నవి చూడుడని యందునకుఁ గొన్నిప్రమాణములను గనుపఱచి యిట్లుండగా శాస్త్రిగారు తలిదండ్రులుచేసిన యుపకారమునకుఁ బ్రత్యుపకారముగాఁ బుత్రులు తమ కృతజ్ఞతను వ్యక్తీకరించుటకుఁ బ్రత్యాబ్దికము చేయవలెనని బోధించియున్నారు. ఇది శాస్త్రవిరుద్ధకార్యమని సుజనులు చెప్పకొనక మానరని తలంచెదము.

ఇది యిట్లుంచి కొంచెము కాలము వాదమునిమిత్తము శాస్త్రిగారు చెప్పినట్లు తలిదండ్రులు చేసిన యుపకారమునకుఁ బ్రత్యుపకారముగాఁ బుత్రులు తమ కృతజ్ఞతను వ్యక్తీకరించుటకే ప్రత్యాబ్దికము చేయవలయునని యంగీకరించుదము. అది చచ్చినవెనుకఁ జేయనేల? బ్రతికియుండఁగా నేలచేయరాదు? బ్రతికి యుండఁగా జేసినయుపకారమునకుఁ గృతజ్ఞతను వ్యక్తీకరించుటయే ప్రయోజనము గాఁగలప్రత్యాబ్దిక మనెడి ప్రత్యుప కారమును బుత్రులు తమ తలిదండ్రులకు బ్రతికియుండఁగఁ జేయరాదు. చచ్చిన వెనుకఁ జేయవలెనని యెచటఁ జెప్పఁబడియున్నది? ప్రతివాని తలిదండ్రులు నుపకారమునె చేయుదురా? కొందఱపకారము

చేసియుండవచ్చుంగదా? చేయనిచోఁ బ్రపంచమున ననేకులు తలిదండ్రులను దిట్టి కొట్టి వెళ్ళఁగొట్టుదురా? అప్పుడాగ్రహమును వ్యక్తీకరించుటకు దేవా దేవేషు శ్రియధ్వములు సాగింపవచ్చునని శాస్త్రిగారు చెప్పుదురా? మనకుఁ దలిదండ్రులు మాత్రమే యుపకారము చేయుచున్నారా? మిత్రులనేకులు చేయుటలేదా? వారికిఁగూడఁ గృతజ్ఞతను వ్యక్తీకరించుటకుఁ బ్రత్యాబ్దికము చేయవలయునా? శాస్త్రిగారు చేయుచున్నారా? శాస్త్రలోక జ్ఞానములను సంపాదించుకొనక ముందు గ్రంథములు వ్రాయఁబూనినయెడ వచ్చెడి చిక్కు లిట్టివని శాస్త్రిగారు గ్రహించియుండుట మంచిదని సుజనులు సూచింప వచ్చునుగదా? అనియున్నది.

కనుకఁబట్టి తాను చేసినది పుణ్యబోధయనియుఁ దాను శాస్త్రలోక జ్ఞానములను బాగుగ సంపాదించికొని వ్రాయుచున్నట్లును, తాను సుజనుఁ డైనట్లును వ్యక్తమగుచున్నది. కాఁబట్టి యీతనికిఁ బండితంమన్యత్వము స్థిరము ను విషయమై సంశయింపఁ బనిలేదుగదా? ఇతనికుంగల శాస్త్రలోకజ్ఞానాతిశయ మంతయు నీవిమర్శనము వలనని లోకులకు కనిపెట్టనగును.

ప్రత్యాబ్దికము కృతజ్ఞతను వ్యక్తీకరించునది యను మాటశాస్త్రవిరుద్ధ మెట్లగును? కృతజ్ఞత ప్రత్యాబ్దికమునకు ఫలమని యెవ్వరైనఁ జెప్పియుండునెడఁ దలిదండ్రులఁ బరమ పదమున కనుపుట గోత్రాభివృద్ధి రెండును బ్రత్యాబ్దికము నకు ఫలములని శాస్త్రము చెప్పుచున్నది. కృతజ్ఞతే ఫలమని నీవెట్లుచెప్పుదువని కలహింపవచ్చును అట్లుచెప్పినవారెవరు? పుత్త్రులు తలిదండ్రుల ప్రత్యాబ్దికము జరుపుటకుఁ గృత

జ్ఞత నిమిత్తమనియేగదా శాస్త్రిగారి యభిప్రాయము. ఇట శాస్త్ర విరోధము శాస్త్రజ్ఞులకు గోచరించునదికాదు.

ప్రత్యాబ్దికమునకు శాస్త్రమునఁజెప్పబడినఫలద్వయంబును నారాధనవిధియందును గలిగియున్నట్లు తానే కనుపఱచి యున్నాఁడుకాన ఈ శాస్త్ర రహస్యము తనకే తెలిసెను గాని శాస్త్రిగారికిఁ దెలియదని యీ జన్మమున ఋజువుచేసికొనఁజాలఁడు.

ఇఁక శాస్త్రిగారికి శాస్త్రలోక జ్ఞానములు లేవనియుఁ దనకుఁ గలవనియు, విజ్ఞవీగుట యుపోద్ఘాతములోని కృతజ్ఞతను వ్యక్తీకరించుట కనుమాటం బట్టియేకదా? తలిదండ్రులు పరమ పదము నొందుట ముఖ్యప్రయోజనమని తానంగీకరించియె యున్నాఁడు.

తలిదండ్రులు పరమపదము నొందవలయునని కుమారుఁ డెంచుటకు నిమిత్తమేమి? అని యడిగిన నీయాజియేమని నోరుదెఱచునో గోచరింపదు. అట్టి భావము కుమారునకుఁ గల్గుట కృతజ్ఞతా మూలముననేగాక యదిలేకున్న నెట్లు సంభవించును? ఇంత మాత్రము తెలియకతనయజ్ఞానతిమి రాంధత్వము సంతయు నొక్కమారు జగమున వెల్లివిరియించెను.

మఱియు నీతని ప్రజ్ఞాసంపత్తిఁ గనుఁగొనుఁడు.

కృతజ్ఞతను వ్యక్తీకరించుటకుఁ బ్రత్యాబ్దికము జరుపంబడునేని యది తలి దండ్రులు జీవించియుండఁగా నేల జరుపఁగూడదు? ఏదేనొక యుపకార మొనరించిన మిత్రులకును గృతజ్ఞతాసూచకముగాఁ బ్రత్యాబ్దికము నేల చేయరాదు? అనియు మున్నుగాఁగలదు. ఇదియుఁదన శాస్త్రిలోకాజ్ఞానమున వూర్తిగఁ దెలిపెడిని. ఏలయందురా? ఎవరికై

ననుదాను బ్రత్యుపకారము సల్పుటకు నిమిత్తము కృతజ్ఞత యొకటియేయైనను దానిని సూచించు క్రియలు దేశకాలపాత్ర భేదమును బట్టి వెవ్వేఱుగనే యుండును, ఎట్లనిన,

కృతజ్ఞతాసూచకముగఁ దలిదండ్రులకన్నము పెట్టుమనియెవ్వరైనఁ జెప్పుదురేని అన్నముపెట్టుట కృతజ్ఞతాసూచకమని యీయాజి జ్వరము వచ్చినప్పుడును తండ్రికన్నము పెట్టి చంపునా? లేక అన్నముపెట్టుట కృతజ్ఞతా సూచకమంటిరి. జ్వరము వచ్చినప్పుడును అన్నముపెట్టి చంపవలయునా? అని కలహించునా ? వివేకము లేనప్పుడేమి చేయును ?

కృతజ్ఞతాసూచకముగా నెవ్వరికైన హితమాచరించుట హితము. కావునఁ దలి దండ్రు లారోగ్యవంతులుగా నున్నప్పుడన్నము పెట్టవలయు, సరోగులుగా నున్నప్పుడౌషధమియ్యవలయు, మృతులైనప్పుడౌర్ధ్వ దైహికమును జరుపవలయును. ఇన్నిటికినిమిత్తము కృతజ్ఞత యొకటియేఅయినను సమయభేదమునుబట్టియు నధికారిభేదమును బట్టియుఁ గృతజ్ఞతను వ్యక్తీకరించు క్రియలు వెవ్వేఱుగనే యుండునని ఇంచుకవివేకము కలిగి యున్నవారెఱుంగనిది కాదు.

ఇఁక నెప్పుడైన నెవ్వనికైనఁ గృతజ్ఞతా సూచకముగా ప్రిత్యాబ్దికమునే పెట్టవలయునని యెవ్వరైన వ్రాసియుండు నెడ నట్టివికల్పముల కవకాశముండెడిని. అట్లు శాస్త్రిగారు వ్రాసినయుపోద్ఘాతమునఁ గలదా ? లేదు. కావున నీవికల్పమంతయుఁ దన విపరీతబుద్ధికైశద్యప్రిభావమునే కలిగినదనుట నిక్కము.

ప్రిత్యాబ్దికము ప్రకృతమైనందునను, పరలోకగతులగు తలిదండ్రులకు నిదియె హితమైనందునను, కర్తఁకుఁ బ్రికృత

కర్మము నందాసక్తి కలుగుటకు సాధకముగా కృతజ్ఞతా సూచకమని చెప్పినంత మాత్రమున నేశాస్త్రమునకు విరోధము వచ్చెను? పితృశ్రాద్ధికాదులు తలిదండ్రులకు హితకరములను నది శాస్త్రవిరుద్ధమా? పుత్త్రాదులు తలి దండ్రుల యెడ హితైషులను నది శాస్త్రవిరుద్ధమా? వైద్యనాథదీక్షితీయ శ్రాద్ధకాండమున, దాన విధియందు. "సంజ్ఞాహానౌతు హితైషీపుత్రాదిస్తద్ద్యాత్" అని కలదు. దీనింబట్టి రెండును శాస్త్ర విరుద్ధములు కావనుట స్పష్టము.

ఇంకనొకటి స్వానుభవ విరుద్ధమై యుండునగు. తలిదండ్రులు కొమరుల కుపకారము చేయుటయుం గొమరులు కృతజ్ఞతంగలిగి తలిదండ్రుల హితముగోరుటయు గనుకది. ఈతని తలిదండ్రులీతనికి గొప్పయుపకారము చేసియుందురు. దాననే పరంపరాయాతమై శివసాయుజ్యప్రాపకమగు నారాధనవిధి విడిచిపెట్టి తన తలిదండ్రులకు పితృపతిలోకప్రాపకమగు శ్రాద్ధవిధిం జేయుచున్నవాడు.

కావుననే తలిదండ్రులందఱు నుపకారమునే చేయుదురా? అపకారమును చేయువారు లేరా? అని యారంభించెను. దీనింబట్టియు నీతనివిమర్శకతాసామర్థ్యంబంతయు వ్యక్తమగుచున్నది.

లోకమునం దలిదండ్రు లపకారమెప్పుడు చేయుదురు? ఎటనైనం గుమారుండు యౌవనవంతుండై యొకమాట మీఱినప్పుడుగదా? అప్పుడైన నట్టివారుందురేమో యని సంశయింపవలసినదే. ఉండినను బాల్యముననో? కనుపుండబడినప్పుడో అపకారముచేయువారుందురా? అట్లు కనంబడిననాడే తలిదండ్రులపకారము చేయంబూనిన దానింతె కులదీ

పఱుచునై తనదు కులమును మతమును దేశమునుగూడ నిట్లు భగ్నన నెట్లు వెలిగింపఁగలుగును? కాఁబట్టి తలిదండ్రులపకారముచేయుదురని పలుకువాఁడైన నదివఱకు (తాను ప్రబుద్ధుఁడగునంతకు) కొంత కాలమైన నుపకారము చేసి యుందురని పూర్వస్మృతిగలవాఁ డొప్పుకొనకపోఁడు. దీనింబట్టి యంతకు మున్ను తనకుఁజేసిన యుపకారమునకై కృతజ్ఞతా సూచకముగఁ జేయవచ్చునని యేమాత్రమైనఁ గృతజ్ఞత గలవాఁ డంగీకరింపకుండడని తోఁచెడిని కృతజ్ఞతయన నేమో యెఱుఁగనివాఁడెట్లును నంగీకరింపఁడు.

మఱియుఁదాను కుమారుల కపకారము చేసియుండు టంచేసి ప్రత్యాబ్దికము కృతజ్ఞతాసూచకముగానే తనకుఁ దనకుమారు లాచరింతురని తప్పక భయము కలిగి యుండును. దాననే కాఁబోలు? కృతజ్ఞతాసూచకమనుమాట ఖండించుట కుపక్రమించెను.

ఈతని సూక్ష్మబుద్ధి యిప్పటి వారి యభిప్రాయముల విమర్శించుటకే యింతచాలియున్నది. ఇఁక సనాదిమతాచార్యులు చేసిన సిద్ధాంతముల విమర్శింప నెట్లు చాలునో దీనింబట్టి యూహించికొనుఁడు.

ఇదిగాక శైవులాచరించు నారాధనవిధి విజాతీయారాధనవిధియని పలుమారు పలికి యున్నవాఁడు. వీని తండ్రి తాత ముత్తాత మున్నగా శైవాగును నేటికిని సజీవులై యున్న తనయన్నయు నీయారాధనవిధిచేతనే ప్రత్యాబ్దికముల జరుపుకొనియు జరుపుకొనుచు నున్నవారు. ఇట్టియెడ నీయారాధనవిధి విజాతీయారాధనవిధియే యగునేని వీని పెద్దలందఱు విజాతీయులే యగుదురని తాను నిశ్చయించుకొనినట్లు

స్పష్టమగుచున్నది. కాన నీతఁడు కృతకృత్యుఁ డయ్యెనని విశ్వసింపవలసినదే. కులదీపకుఁ డవతరించినందున కింతకన్న సాధింపవలసిన దింకేమికలదు ?

ఇట్లు తప్పు తాకు రెండు నెఱుంగనియసభ్యసంభాషణాం బునకురోసియే పండితులీతనితో వాఙ్మిశ్రణంబున కుత్సహింపకున్నవారు. ఇదియె యుపాయంబుగఁ గైకొని దిగ్విజయమున కారంభించెను. అట్లుగాక పండితులు మౌనము విడిచిన నీతనికి బ్రతుకుఁదెరువెక్కడిది ? ఆలోచింప నీతని పాండిత్యం బంతయు బూతులలోనసె, కావునసె.

తన యోగ్యతనెల్లఁ దెలుపు నశ్లీలంబులఁ గొన్నిటి నుపయోగించుకొని యున్నాఁడు ఎట్లనిన, శాస్త్రిగారు మృతులైన తలిదండ్రులనుగూర్చి చేయు ప్రత్యాబ్దికము యొక్క ప్రయోజనమునుగూర్చి యనువోట మృతులైన యను పదమున కేమిప్రయోజనము ? మృతులైనయని లేకున్న బ్రతికి యున్న తలిదండ్రులకుఁజేయు ప్రత్యాబ్దికమని తనపత్రికా గ్రాహకు లెంతురనియేకదా ? దీనింబట్టి తన పత్రికాగ్రాహకుల యందెంత జ్ఞానసంపత్తిని దాను భావించియున్నది తేటపడుచున్నది.

ఇట్లు నిరంకుశ శక్తి సంపన్నుండుకావునసే యేమియుఁ దోచక పండితులు మౌనమునే శరణీకరించుకొని యున్నారు. ఈతని జయింపఁ బండితుల కెట్లు సాధ్యమగు?

అపభ్రంశములకు వెఱువఁడు " అసత్యములకు జంకు గొనఁడు " అపకీర్తికు రోయఁడు. అశ్లీలంబులకు వెను దీయఁడు. ఇట్టి వీరశిఖామణినిగా నెఱింగియే యీతని జన్నికి విడిచియున్నవారు.

ఈతని విమర్శనపరిభావమున కనేకులు విభ్రాంతి నొందు చున్నవారును గలరు. ఈతఁడు పెద్ద స్కాలరని కొందఱు స్తుతి పాఠములను గూడఁ జేయుచున్నారు. అట్టివారందఱు నీతని ప్రేరేపించియైన నీతఁడు వ్రాసినయుపోద్ఘాత విమర్శను యుక్తియుక్తముగా సాధించుకొనునట్లు చేయవలయును. కృతజ్ఞతాసూచక మను మాటమీఁద నీతఁడు కావించిన విమర్శనమును నిర్దోషమని సాధించుకొని యుపోద్ఘాతవిమర్శనాకూపారమునుండి పారముఁ జేరునెడఁ దక్కునాక్షేపములకును సమాధానము చెప్పుటకు సిద్ధముగా నేయున్నాఁడను. బసవేశ్వరునిఁ దాను దూషించుచున్న యంశమునకు మాదలగ్రామమున జరిగిన శైవ మహాసభలో శ్రీ శాస్త్రిలవారు సమాధానముచెప్పియుండ నప్పుడేమైనఁ దాను నోరు మెదలించెనా? యలకురు గ్రామమున జరిగిన శైవ మహాసభలో నీతండు శ్రీ శాస్త్రిలవారి నుద్దేశించి వ్రాసి బహిరంగ లేఖలోని యంశములన్నియు నసత్యములని శాస్త్రిలవారురుజువుచేసినప్పుడు నోరెత్తి యుండెనా? కావుననే యీతనికై ప్రత్యేక మొక కృతిరచింపఁబడియె. దానిలోనిని దగు నీపద్యమొకటి వినుఁడు.

సీ॥ తెంపునైనన్నియుం దెలిసినట్లు నటించి
విజ్ఞులనెదిరించు వెడఁగుతనము
ఎదుట నోరెత్తక పదఁపడిబుధులను
దూలనాడుచు వ్రాయు తులువతనము
తనవాదమెల్ల మాసినయప్పుడును మిన్న
కుండక వాదించు మొండితనము

నలుదెసల్ నిండి భాసిలునపఖ్యాతియె
విఖ్యాతిగానెంచు వెఱ్ఱితనము
గీ॥ గలిగి, మానావమానముల్ గణికయట్టు
లెంచు నినుగెల్చుటెట్లు, భాషించుటెట్లు
నిల్వఁగంతట, జగమెల్ల గెల్వుమిట్లు
ప్రాజ్ఞజన గర్హ్యగుణరాజి, పాకయాజి॥

మఱియు నీతండెవరివలననో శ్రీ శాస్త్రిలవారు మతగ్రంథములఁ గొన్నిటి రచించియుండిరని విని యవి వెల్వడు నెడ శైవమతంబు నిర్మూలీకరింపఁ బూనిక వహించియున్న తన దుష్ప్రయత్నంబు కొనసాగదని యెంచి ముందుగనే తన యధికప్రసంగపాండిత్యమంతయుఁ గనుపఱచు నెడ శాస్త్రిలవారు భయమంది తమగ్రంథములఁ బ్రకటింప కుందురనియు దానంజేసి తన పూనిక నెగ్గించుకొన వచ్చుననియు దూరదృష్టితో నీయుపోద్ఘాతవిమర్శమను సగాథములోనికి దిగినట్లు తోచుచున్నది. ఇటనుండి తెప్పఱిలి లేచివచ్చిననాటికిఁ జూతముగాక. ఈతని దురూహ లోన నిముసనదిగాదు.

కావున నే శాస్త్రలోకజ్ఞానముల సంపాదించుకొనక గ్రంథములు వ్రాయఁబూనిన వచ్చెడు చిక్కులిట్లుండునని సుజనులు సూచింపవచ్చునుగదా అని మాట పడినది. ఈతని యారాధనవిధివిమర్శనమను నీవిమర్శాదర్శమునందు నీతని శాస్త్రజ్ఞానవైభవము, లోకజ్ఞానసంపూర్తి బుద్ధివైశద్యప్రభావము మహాయోగ్యతావిశేషము మున్నగు సకలమహాపురుషలక్షణంబులు ప్రతిఫలించుచున్నవియెకదా? ఇంక నీతనినింతటితోఁ బోవిడుతము.

ఈతండాక్షేపించిన తర్కనాక్షేపంబులకు సమాధానం బేమని యడుగుదురా ?

ఈతండు చేసినయాక్షేపములకేగాక యీతని పుట్టించిన పితామహాదు లాక్షేపించినను తిరుగనేరని సిద్ధాంతములు గ్రంథరూపములుగా నుండియేయున్నవి. వానిం బ్రకటించుకొనిసంజాలును.

శైవసిద్ధాంతమును దెలుపు గ్రంథము లెయ్యవియందురా ? గ్రంథములు లేకపోలేదు. వానిం గోరువారే లేరు. ఇట్టి యాక్షేపములు వచ్చునవియే శ్రీ శాస్త్రిలవారు మొదటినుండి మతగ్రంథ సంవాదసంబునకై కడంగి యచ్చటచ్చట గ్రంథముల నాజ్ఞించుచు గ్రంథోద్ధరణమునంగాని మతమునకు గౌరవము కలుగదని సంఘమువారికిం బలుమారు బోధించిరి. శైవమహాసభలకును వ్యయప్రయాసల కోర్చి నానావెకు వచ్చియుండి గ్రంథముల యావశ్యకతను గూర్చి విన్నవించియుండిరి. శ్రీ శాస్త్రిలవారు ప్రతిశైవమహాసభలోం జెప్పినది దేనిని గూర్చి ? మత గ్రంథములను గూర్చియే. ఒక సభలోనైన నాలకించినట్లున్నదా ? లేదు. ఇది యంతయు సిమతమునయొక్క దురదృష్టతయె. అనుకూల్యము లేకుండుటయె గాక ప్రాతికూల్యము పూర్తిగనే కలిగియున్నది.

ఈసంఘమున మతగ్రంథములప్రకటనకు దోడ్పడువారు లేరుగాని నీయిచ్చవచ్చినట్లు దూషణముచేయుమని పాకయాజికిం దోడ్పడువారు సమృద్ధిగ గలరు. శైవమహాసభయందు గ్రంథములకుం బురికొల్పువారు లేరుగాని మతగ్రంథములెన్నటికిం బ్రకటింపంబడకుండునట్లు తీర్మానములం గావించువారు కలరు. సిద్ధాంతగ్రంథములు వెల్లడిగా లేనందునను

లోపమిప్పుడైనఁ దెలిసెనా ? శైవాచారములు కలిధర్మము లనియు మహాపాతకములనియుఁ గూడఁ బ్రటింపఁబడుచుండ నుపేక్షాభావమునే వహించెదరా ?

ఈ సంఘమున ధనికులులేరా ? దాతలులేరా ? జమీందారులులేరా? మతాభిమానులులేరా ? అందఱును గలరు మత మప్రతిష్ఠార్ణవమున మునిఁగిపోవుచున్నను నొడ్డునకు లాగవలయునను కుతూహలము కలవారు లేరు.

ఈ పత్త్రికలో దూషింపఁబడిన మా మతన నీమతాచారముల కేమి హానియని యందురా ? నిజమే.

అయినను నిట్టిసమయమున విమతులుగాని స్వమతులుగాని ఈ మతాచారముల ప్రామాణ్యమును దెలుపు గ్రంథమెద్దియని యోజింప నట్టి సిద్ధాంతగ్రంథ మొక్కటియైనఁ బ్రకటితముగానప్పుడు వారేమని భావింతురు ? మతాచారములు నిష్ప్రమాణములనియేకదా యెన్నంబడును. దూషకుని గతియిటుండనిండు, మతస్థుఁడగునేసంస్కారియైనను తనకుఁ గలిగిన సందియము నేగ్రంథమునుజూచి తీర్చికొనవలయు ?

ఈకాలమునఁ బ్రాయికముగ మతధర్మము లెట్టివని విచారించి తెలిసికొను కుతూహలము కలవారేలేరు. నూటికొక్క రిద్దఱైన నున్నను వారికిఁ గలిగిన సంశయము దీర్చికొనుటకు సాధనమగు గ్రంథము వెల్లడిగాలేదు. అప్పుడు మతములోని పండితుల నడుగుదురు. వారును దమకుదెలియకున్నను నభిమానముతో సర్వముఁ దెలిసినట్లు నటించి తోచిన విధమున సమాధానము చెప్పెదరు. అందఱు నొకవిధమునఁ జెప్పుదురా ? లేదు. వీరికి మతగ్రంథమేదైన దొరకినదా ? దానింబట్టి యొక విధమునఁ జెప్పుటకు ? కావున వారి వారి

బుద్ధికిఁ దోఁచినట్లనేక విధములఁ జెప్పుదురు. దీనివలన వారి సందియములు దీరునా? తీరవు. పలువిధములఁ జెప్పుటంజేసి మఱింత హెచ్చగును. ఇట్టి సంశయగ్రస్తులకు మతమున నాసక్తియుండునా? ఉండదు. అంతమాత్రమేగాక వారికి మతమున స్వప్రామాణ్యబుద్ధి స్థిరపడును. ఇట్టివారు తెలిసుగ మతమునుండి తొలఁగుట యైన సంభవించును. లేకున్న మతదూషకులై యొరుల చిత్తమునుగూడఁ జెఱుచుట కారంభింతురు. ఇట్టివారు కొందఱేర్పడునెడ మత మంతరించుట కెంతయో సేపుపట్టదు. కావున గ్రంథలోపముకంటె మతము శీఘ్రముగ నంతరించుటకుఁ బరమసాధన మింకొక్కటిలేదు.

ప్రతి మతమున నధికారులు రెండు తెఱఁగుల నుందురు. అందు మతాచారములయందు మూఢ విశ్వాసముతో నాసక్తిగలవారు కొందఱు మతధర్మముల విమర్శించి వాని ప్రామాణ్యము నెఱిఁగి యాసక్తితో ననుష్ఠించువారు మఱి కొందఱు ఈమతమున గ్రంథ దారిద్ర్యముంబట్టి రెండవకోటికిఁ జేరినవారు లభింపరు. కేవలము మూఢ విశ్వాసముతో మత మెంతకాలము నిలుచును? ఆదికాలమున శబ్దప్రామాణ్యముం బట్టియే యీమత మన్నిమతములలో నగ్రస్థానము నలంకరించినది. కావుననే నేటివఱకు విమతులచే నెంతకాలము నుండి విద్యాస్థానములు సంస్కరింపఁ బడుచున్నను నిప్పటికి స్వరూపనాశనము నొందక యీమతధర్మములప్రమాణము లింకను నచ్చటచ్చట దొరకుచునే యున్నవి. మధ్యకాలమున నీమతము తపశ్శక్తిచే సకలలోకగురుత్వమునొంది పూజ్యతఁ గాంచినది కావుననే యీమతస్థులు వేకువను లేచినదిమొదలు నడిరేయివఱకు షట్కాలశివపూజా ధురంధరులై పదచలనముఁ

జేయక కాలముఁ గడిపి రింతియకాని మూల గ్రంథములఁ గాపాడినవారుగాని, నిబంధనగ్రంథముల రచించినవారు గాని లేరు. ఈకాలము వచ్చువఱకు గ్రంథములు కావలయు ననిన నెట్లు దొరకఁగలవు? ప్రతినగరము నందును. గొప్ప గొప్ప ముద్రాయంత్రములను బ్రతిష్ఠించి తమతమ మత గ్రంథముల నెందఱెందఱో విమతులు ప్రకటించుచున్న వారు. కాని యెచ్చటనైన నీమతస్థులలో నొకరైన ముద్రా యంత్రమును స్థాపించి మతగ్రంథమును బ్రకటించి నట్లు కలదా? లేదు. వీరి యుపయోగమునకై వీరి మతగ్రంథ ములను ముద్రించి యనువుటకు మతాంతరులకవసరమేమి? కావున నెటుఁజూచినను విమతగ్రంథములే, ఇట్టిసందర్భమున మన మతగ్రంథమెట్లు దొరకును? ఇట్లు, శైవమతగ్రంథ ములు స్వరూపనాశనమునొందు నదను వచ్చినను నేరికిని బట్ట దయ్యెను. దీనికై శ్రీ శాస్త్రులవారనేకదేశములు దిరిగి పెక్కు పుస్తకశాలలలో నొక్కొక గ్రంథమునార్జించి యం దుపై తమ పాండితి నుపయోగించి కొన్ని పౌరుషేయగ్రంథ ముల రచించి వీనినైన నుపయోగించుకొనుఁడని యెంత బోధించినను 'మహాసభవారు కలరుగదా' వారితోఁ జెప్పి కొమ్మని తక్కుంగలలోకులందురు, సభవారితోఁ జెప్పికొనఁ బోవశాస్త్రులవారికి మాకును భావ్యము విషయమై తగాయి దా కలదుగాన నది తేలు దనుక వీరిగ్రంథములు ప్రకటింపవీలు లేదని శ్రీశితయ్య శాస్త్రులవారడ్డగింతురు. సభవారిలోఁ బూర్వాచారాసక్తులే తక్కువ దానికిది సాయపడియెను. కాఁ బట్టి భావ్యసందేహము పరిష్కారము కాలేదను నెపమున గ్రంథముద్రణమునకై తోడ్పాటు గావింపరు. భావ్యనిర్ణయ

మైనఁ దేలునా? అది యుభయవాదములను గాంచి మహా జనులు వారికివారు నిశ్చయించుకొనవలసినదే? కావున గ్రంథసాహాయ్యకము మహాసభవారివలనఁ గలుగుననుట నిరాశాస్పదముగనే కన్పట్టుచున్నది. శైవమహాసభాకార్యదర్శులు శైవమతదూషణ పత్రికకు మొట్టమొదట ప్రధానపోషకులై కనుపట్టుచుండ మహాసభవారు శైవమతగ్రంథ ముద్రణమునకుఁ దోడ్పడుదురని యెట్లు విశ్వసింపనగును? కాఁబట్టి యీసంఘమునఁ బూర్వాచారాభిమానులెవ్వరైనఁ గలిగి యుండునెడ నింతటనైన ముందడుగువడి తోడ్పాటు గావించుట యుక్తము.

ఇప్పటికి దొరకిన మూలగ్రంథము లెవ్వి? శ్రీశాస్త్రిలవారు రచించినపౌరుషేయగ్రంథములెవ్వియని యడుగుదురా?

శైవసిద్ధాంతమునుదెలుపు మూలగ్రంథములలోశాంభవీయగృహ్యాపరిశిష్టంబను కల్పసూత్రింబొకటియు, వాతూలోత్తరము, చంద్రజ్ఞానోత్తరము ననురెండు శివాగమంబులు నిప్పటికి లభించినవి. వీనింబట్టి శ్రీశాస్త్రిలవారు ధర్మసంగ్రహమను శైవనిబంధనగ్రంథము రచింప మొదలిడి ఆహ్నిక కాండము, అంత్యేష్టికాండము, నను రెండుభాగములు పూర్తిగ రచించియున్నారు. శైవులు వేకువను లేచి నదిమొదలు రాత్రిపండుకొనుదాకఁ జేయఁదగు సకలకర్మములకు శాస్త్రీయములగు విమర్శములతోఁ బ్రమాణ్యములాహ్నిక కాండమునందుఁ గనుపఱుపఁబడియున్నది.

ఇందు స్మార్తాదిమతాంతరధర్మములకంటె భిన్నములైన శైవధర్మములకు (అనగాఁ గనుబొప్పలు జెవులు మున్నగు

చోట్ల భస్మను ధరించుట శంభ్వాదినామములతో నాచమ నముచేయుట పితృతర్పణము. వైశ్వదేవము శైవులెట్లుచేయ వలయుననునంశము, శివపూజాపద్ధతియందు పట్లు వత్తులుమొదలగునాని) ప్రామాణ్యము మొదలుగాఁ బ్రతిదినము చేయఁ దగిన సకలకర్మములు సప్రమాణములని సిద్ధాంతము చేయఁ బడియున్నవి.

ఆ న్త్యేష్టికాండమునందు శైవులు దేహావసానంబున దహనాదికర్మములు చేయవలయునని శ్రీ పండితస్వాముల వారప్పటిపండితసాహాయ్యముతోఁ బూర్వాచారమునుఖండించి తయారు చేయించిన దహనసాపిండ్యాదిసిద్ధాంత గ్రంథము మొదట ఖండింపఁబడియుంనుటయె గాక సమాధ్యాదులకుఁ బూర్వాచార్యులు కనుపఱచిన ప్రమాణములకన్న వేదాది ప్రమాణముల నెక్కుడుగాఁ గనుపఱచి ద్వాదశాహావిధితో నంత్యేష్టికిని బ్రత్యాబ్దికాద విధకని దగు ప్రమాణంబులఁ గను పఱచుచు సకలపూర్వాచారములును సిద్ధాంతీకరింపబడిఁ యున్నవి. మఱియు శైవులవిశేషధర్మముల విధించు శివాగమ ములప్రామాణ్యము విద్యాస్థాన వినిర్ణియంబునఁజేయం బడియున్నది.

ఈవిధమున శ్రీశాస్త్రిలవారు పలుచోట్ల మతగ్రంథముల నార్జించి వానింబట్టి కొన్ని నిబంధనగ్రంథముల రచించియున్నారు. వానిం బ్రకటించుకొనుటకన్న సాధనాంతరము లేదు. కొందఱు సంస్కారులీగ్రంథములపై ననూయగలిగి యున్నారని తోచెడిని శ్రీశాస్త్రిలవారికిఁదమ గ్రంథములె ప్రకటింపఁబడవలయునని పట్టుదలలేదు. మతధర్మవిషయసంశ యనివారకములగు గ్రంథము లెవ్వారలచే సంపాదింపఁబడిన

వై నను బ్రకటనగావలయుననియే కోరిక. ఈవిధమగు గ్రంథములు మఱియెవ్వరైన రచించియున్నయెడ నవియె ప్రకటింపఁబడవచ్చును. లేనియెడ నివియైనఁ బ్రకటించుట మేలుగాని వీరిగ్రంథములేల ముద్రితములు గావలయునని యపూయను వహించి మతమునకు హానికలుగఁ జేయుట యుక్తముగాఁదోపదు.

ఈగ్రంథములు ప్రకటించునెడ సంఘమునకు గొప్పనష్టము వచ్చునని పిండ ప్రదానాభిలాషులు నసూయాగ్రస్తులును బరమాప్తులువోలె నుపదేశింపఁగలరు. వారిమాట మీరెంతమాత్రము నమ్మఁగూడదు.

శ్రీ శాస్త్రిలవారు శక్తి కొలఁది గ్రంథములయందుఁ బూర్వాచారములకుపపత్తిని గనుపఱచి యున్నారు. కాని క్రొత్తపద్ధతులేవియుఁ దీర్మానించియుండలేదు. కాఁబట్టి చాలవఱకు సంఘమునకుపకారకములే యగుఁగాని యెన్నటికి నపకారకరములు కానేరవు. కావున యావచ్ఛక్తిసాహాయ్యము నర్హ సమయమైయున్నది. శ్రీశాస్త్రిలవారుపలుదేశములుదిరిగి గ్రంథముల నార్జించినందునకుఁగాని పెక్కుకాలము శ్రమపడి గ్రంథములు రచించినందునకుఁగాని మీతోడ్పాటు కోరియుండలేదు.

బహుగ్రంథ ముద్రణము పుష్కలధనసాధ్యముగాన నిది కోరవలసివచ్చెను. ఇఁక మీరందఱు పిండప్రదానాది నూతనాచారతత్పరత్వముననో కారణాంతరముననో మానసమునే వహించియుందురేని అప్పుడు శ్రీశాస్త్రిలవారికిఁ జాలవఱకు సుఖముకలుగఁజేసినవారే యగుదురు. ఏలన, నింతటనైనవారు "అరణ్యరుదితం కృతం" అనున్యాయమునుదలం

చుకొని యిస్సీయని నిరుత్సాహతఁజెంది తప్పక యిప్పని విడిచి హాయిగనుందురు.

ఎవ్వరికిఁ బట్టని యీయంశము నీకుఁగాని, మీ శాస్త్రులవారికిఁగాని, యేలని మీరడుగవచ్చును. ఇది నిజమె కాని యీమూరుచూచి యిఁకనెన్నటికి నీసంగతి బోధించి మీ చేత నీప్రశ్న మడిగించుకొనను.

ఇట్లు,
ముదిగొండ రామలింగశాస్త్రి
వరంగల్.

ఈ మతగ్రంథముల నపేక్షించువారు కనఁబడలేదని యాలోచించుచుండను శ్రుతిధర్మ సంజీవనీ పత్త్రికలోనను 8వ సంపుటము, 9 వ సంచికలో నొక యుత్తరము ప్రకటితమై కనఁబడినది. అది చూడగనే ఎండిపోవుచున్నపైరుపై సంగురియు వానవోలె సత్యానందజనకంబయ్యె. అది యేమన,

ఉత్తరము.

బ్రహ్మశ్రీ ముదిగొండ నాగలింగ శాస్త్రిగారి సన్నిధికి.

అయ్యా,

తాము రచించిన యారాధనవిధిపై నైదుదోషములను జూపుచు శ్రుతిధర్మ సంజీవని 8 వ సంపుటము, 9 వ సంచికలో తత్పత్త్రికాధిపతులు విపులవిమర్శనము గావించియున్నవారు. దానిని మీరును దిలకించియుందురు. అందులకుఁదామిదివరకుఁ బ్రత్యుత్తరము వ్రాసియున్నారా? లేక వ్రాయనున్నారా? వెంటనే తెలుపఁ బ్రార్థితులు. ఆ విమర్శనము మతమునకవమానజనకముగా నుండుటచే నీ యుత్తరము వ్రాసికొని యున్నారము.

ములుగు వీరభద్రశాస్త్రి. జగ్గయ్యపేట.
ముదిగొండ కాళహస్తిలింగం నందిగామ,
ములుగు కాళహస్తిలింగం, కోనాయపాలెం.
శివపురపు శ్రీశైలం, జగ్గయ్యపేట
ముదిగొండ బసవయ్యశాస్త్రి, ముక్త్యాల.
శివలంక నాగభూషణం, వంగూరు.
శ్రీపతిపండితారాధ్యులరాజయ్య, జగ్గయ్యపేట.

మతాభిమానమన నిటులుండవలయు. తక్కుంగల లోకులును వీరివలెఁదమ యంతన మతోద్ధరణమునకై వెల్వడినవెగాక మతమప్రతిష్ఠార్ణవమునుండి దరిజేరుననుట కల్ల. వీరు తమ యుత్తరము శాస్త్రిగారి కనుపకయ శ్రుతిధర్మ సంజీవని యందుఁ బ్రకటించు ద్వారా తమ పూర్ణాభిమానమును పత్త్రికాముఖమున వెల్లడించుటయుఁగడు శ్లాఘనీయము. ప్రత్యుత్తరము వ్రాసియున్నారా? లేక వ్రాయనున్నారా? వెంటనే తెలుపఁ బ్రార్థితులు. అను వాక్యముం బట్టి వారి యాశయము రెండు విధముల నుండునని తోచెడిని వ్రాసియుండినఁ బ్రకటించుటకుఁ దగు సాహాయ్యక మొనరించుట లేకున్నఁదాము వ్రాయఁబూనుట యిందేదియోకావలయు. ఈరెండును మాకుఁబరమ సమ్మతములే, ఎట్లన, ఆరాధనవిధి విమర్శమునంగల యాక్షేపములకె గాక యవ్విధములగు సకలాక్షేపములకు సమాధానము ధర్మసంగ్రహములోనియంత్యేష్టి కాండమునఁగలదుగాన దానిముద్రణమునకుఁ దోడ్పడినను సంతసమె అట్లుగాక తాము వ్రాయఁబూనినను బరమ సమ్మతమే. వ్రాసికొలఁది శ్రేయమేకదా? కావున నీరెండు తెఱఁగులలో నేదియైన వెనువెంటనే యవలంబించి యీయేప్వ

రును శైవసంఘమునకెల్ల మార్గదర్శకులై ప్రవర్తిల్లుదురనియే నమ్మఁదగియున్నది, ఇట్లు వీరు తమ యాశయమును గ్రియారూపమున వెలిబుచ్చకుండుటేని అప్పుడు మనమేమని యెన్నవలయునని యడుగుదురా? అట్లేని విధివిమర్శకులకుఁ బల్లవినందుకొనువారని లోకు లెంతురని వారికిని దెల్లమేగాన నిందునకై మనము వేరచెప్పఁబనిలేదు. ఆరాధనవిధి విమర్శనము మతమున కవమానజనకముగా నున్నదని వీరి యుత్తరమువల్లను దెలియుచున్నదిగదా? పూర్వాచారాభిమానులు తమ యభిమానమును గ్రియారూపమున వెల్లడించుట శ్రేయము.

క. గానముంగని, శైవులు, మన
మున, మెచ్చన్, రామలింగబుధుఁడి, టులారా
ధనవిధి విమర్శ ముఖము
ర్ధనముఁ గడియించె సుమతితతిగణ్యముగన్.



